





# గేయాలు

పౌరాణిక,జానపద,సామాజిక

# మనోరాగం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

“ఓ బాటసారి !

నీ ప్రయాణం ఎంతవరకు ?

ఆగు! కాసింత ఆలోచించు

జీవనగమనంలో

నీవేద్దైనా, మంచి కార్యం సంకల్పిస్తే

వెంటనే చేసెయ్! త్వరపడు!

కాలం వృధాచేయకు! ఎందుకంటె.....

నీవు మళ్ళీ యీదారిన రాకపోవచ్చు !!!

# మనోరాగం

**ఆర్. రంగస్వామి గౌడ్**
విశ్రాంత పర్యవేక్షక ఇంజనీర్,
సుగుణాలయ, ప్లాట్ నెం. 29,
అబ్బాస్ నగర్, కర్నూలు-2.

**శ్రీ రేఖ సాహితి**
రి.నెం. 2337/89,
ఇం.నెం. 5-11-481,
విద్యారణ్యపురి, హనుమకొండ,
వరంగల్లు - 506 009.

**2001**



## అంకితం

ఎక్కడని వెదకను ?
ఎక్కడని నిరీక్షించను !
జీవన యాత్రలో నాతోబాటే
కొంతకాలం పయనించి
నన్ను ముందుకు నడిపించి
హఠాత్తుగా కనుమరుగైపోయి
నా కనులు మూతబడేదాక,
నా "స్మృతి గీతాల్లో"
లీలగా గోచరించే
విధివంచితులకు.....
ఈ నా ఊహల "డోలిక"
అక్షర మాలిక.....

-ఆర్. రంగస్వామి గౌడ్

# సమాధుల సందేశం

*"Stop! Stranger, Stop! as you passby,*
*As you are now so once was I*
*As I am now so once you will be*
*Be prepared to follow me !*

మరో దేశంలో జన్మించినా, ఈ గోదావరి ప్రాంతంలో అడుగిడి, మీ తీరవాసుల కోసం జీవితాంతం శ్రమించి యీ తీరంలోనే శాశ్వతంగా విశ్రమించిన మా సమాధుల మీదుగా పయనిస్తున్న ఓ బాటసారీ ! కాసేపు ఆగు ! నిదానంగా ఆలోచించు! యిప్పుడు నీ వున్నట్లే ఒకప్పుడు మేము వున్నాము, యిప్పుడు మేమున్నట్లే ఒకప్పటికి నీవు అయిపోతావు. అయితే మమ్ము అనుసరించేందుకు ఎప్పుడూ సిద్ధంగా ఉండు. నలుగురి కోసం పాటుబడుతూ మరణించడంలో ఎంతో ఆనందముంది ! శాశ్వతత్వముంది ! ఇదిగ్రహించు! యీ దేహం అస్థిరం ! యీ జీవితం అశాశ్వతం ! బ్రతికున్నప్పుడు మనం చేసే మంచి పనులే శాశ్వతంగా నిలిచిపోతాయి !!

(1850 - 60లలో గోదావరి తీరంలో మహాదేవపురంను స్థావరంగా చేసుకొని గోదావరి నదిపై " ఇచ్చంపల్లి" ( కరీంనగర్ జిల్లా)వద్ద"కాపర్‌డ్యామ్"నిర్మాణంలో అహర్నిశలు శ్రమించి విధివశాన ప్లేగు వ్యాధికి గురి అయి అసువులు బాసిన ఫ్రెంచి ఇంజనీర్ల సమాధుల వద్ద గల శిలా ఫలకములపై నున్న పై ఆంగ్ల వాక్యాలు ఎందరికో స్ఫూర్తినిస్తాయి! కార్యశూరులు, త్యాగమూర్తులు తిరుగాడిన పరకాల (వరంగల్) ప్రాంతంలో నాటికి నేటికి పెరిగిన అంతరమును తలచుకుం మన అంతరంగాలు అల్లకల్లోలాలు అవుతాయి. శతాబ్దాల నిశ్శబ్దం తాండవిస్తున్న ఆ సమాధు చెంత, చేతులు జోడించి, శిరసువంచి, మనోకుసుమాలతో ఆ సమాధులను అలంకరించినపు మనం మనుషులం అనిపించుకుంటాము.!

# నివేదన

తలుపు తట్టిన మృత్యువు
'దివి'ని బోలు మీ యింట
కాలూన, కాలురాక
వెనుదిరిగి, పరుగెత్త
ఆదమరిచి , నిదురించ
కనుగప్పి, కరాళ మృత్యువు కబళించె
మీ చిట్టి చెల్లిని !

తరలి వెళ్ళె
అనురాగవల్లి
తిరిగి రాదు మళ్లీ

కల్లలాయె కలలన్నీ
వికసించని కుసుమం
దేవుని పూజకు నోచు కోక
చెట్టు మీదే వాడి పోయింది !

అనురాగం వర్షించు మీయింట
కన్నీటి ధారలు కురిసి
తల్లడిల్లు మీ హృదయాలకు
కొండంత "ప్రశాంతత" చిక్కాలని....

నిత్యం వేదమంత్రం
పఠించు మీ యింట
అమృత ధారలు కురియాలని
ఆ భగవంతుని ప్రార్థిస్తూ...!

( సౌజన్యమూర్తి శ్రీ సుందరం ఇ.ఇ గారి సోదరి ఆకస్మికంగా తనువు చాలించిన సందర్భంలో........)

# స్మృత్యంజలి

నాన్నా !
కూలిన నీ సమాధిని
చూచి చింతించనా !
చెమటోడ్చి నిర్మించిన
నీ " రంగనివాస్' లో
మన జ్ఞాపకాలు చెరిపేసి

- నీ గుర్తులు తుడిపేసి
- కొత్త రూపులు దిద్దిన
- సౌధాన్ని చూచి గర్వించనా..!
- నీసమాధి చుట్టూ
- కన్నీటితో కళ్లాపు జల్లి
- అనురాగపు రంగవల్లికలు దిద్ది
- స్మృతి కుసుమాలు పేర్చి

నీ రూపు కోసం... పిలుపు కోసం
పరితపిస్తూ....... అశ్రునయనాలతో......

జననం :- 1911 మరణం : 28-2-74

(మా నాన్నగారు కీ॥శే॥ నరసప్ప, మైన్ ఓనర్, డోన్‌గారి జ్ఞాపకాల ఆర్తితో..... కుటుంబ కలహాల వల్ల "రంగనివాస్"కు దూరమై, ఆ గృహానికి రూపు రేఖలు మార్చి వేశారని తెలిసిన బాధతో......)

# ఆగిపోయిన పాట

తమ్ముడూ!... వేంకటశివుడూ!

కరాళ మృత్యువు

నిను కబళించిన వేళ

నా కోసం పరితపించిన

నీ నయనాలు వెలార్చిన

బాష్పాలతో నాకలం నింపి

పల్లవితో ముగిసిన

నీజీవన గీతాన్ని రచించి

అనుభూతుల శ్రుతిలో

స్మృతుల రాగం మేళవించి

మూగపోయిన గొంతుతో....

'ఆవలితీరం' చేరిన నీకోసం

పదే పదే ఆలాపిస్తూ.....

( అష్టావధాని, తోడల్లుడు అంతకుమించి సాహితీ మిత్రుడు వేంకటశివుడి ఆకస్మిక మృతి సందర్భంగా....)

# బాష్పాంజలి !

నాలుగేళ్ళుగా కలిసికట్టుగా
మసులుకున్న మన జట్టుని చూసి
ఏ దుష్ట గ్రహమో....... కన్నెర్రజేసింది !
నిన్ను మా నుండి విడదీసింది !

మృత్యుద్వారం చెంత ....
అమాయకంగా వీడ్కోలు చెబుతున్న
నీ నీరస నయనాల్లో స్నేహజ్యోతులు
చివరి సారిగా దర్శించాలనుకునేలోగా
శాశ్వతంగా కళ్ళు మూసుకున్నావు!

దిగంతాలలో వెలిసిన
శతకోటి నక్షత్రాలలో
నీవు ఏ తారగా మారావో కనుగొనలేక
నిరాశా నిట్టూర్పులతో సజల నేత్రాలతో....

( సహ ఉద్యోగి, సౌమ్యుడు నరసింహులు గారు తేది: 30-3-1988 నాడు
అకాల మరణానికి గురయిన సందర్భంలో.........)

# అనురాగపు స్మృతిలో !

చెల్లీ ! అనురాగవల్లీ !
అంతలోనే....
నీ కళ్ల కాంతులు
దిగంతాలలో
చోటు చేసుకున్నాయా తల్లీ !
చిన్న నాటి కేరింతలు
భోగ భాగ్యాల విలాసాలు
దాంపత్యపు మధురిమలు
ఒక్కటొక్కటే కనుమరుగయిపోగా....
వెతలను మిగిల్చి
గతాన్ని నెమరేసుకోమన్న
కరుణించని కాలం తీర్పుతో
తెగతెంపులు చేసుకొని ! 'ఆవలితీరం'
చేరుకున్నావా రత్నమ్మా!

జననం : 26-10-1943, మరణం: 3-11-1988

(చిన్ననాటి నుండి ఒకే చోట పెరిగి రక్త సంబంధాన్ని మించి చెల్లిగా అనురాగం పంచి మరోలోకం చేరుకున్న బి. రత్నమ్మ డోన్ స్మృతిలో....................)

# నిరీక్షణ

నీ వాళ్ళందరినీ
సుఖాల రేవుకు చేర్చి
నీవూ... వాళ్ళను చేరి
ఆ తీరంలో కాసింత విశ్రమిద్దామని,
కాల స్రవంతిని దాటేయత్నంలో
మృత్యుగుండంలో కృంగిపోయింది
నీ ఒంటరి నావ !
నీ కోసం పరితపిస్తూ....
మళ్ళీ కనిపిస్తావేమోనని
తీరం వెంబడి
వెర్రి ఆశతో పరుగులు తీసే
నీ కుటుంబ సభ్యులతో
నేను సైతం గాలిస్తున్నా......!

జననం : 20-3-1936 మరణం : 17-5-1995

( వియ్యంకుడు బావగారైన గోళ్ళ శ్రీరాములు కర్నూలు వారి ఆకస్మిక మృతి సందర్భంగా........)

# రామ్మా, రా... త్వరగారా !

"అమ్మేది " అమ్మమ్మా అంటే
గుడ్ల నిండా నీళ్ళెట్టు కొని
నీలాకాశం వైపు చూపిస్తుంది
తాతయ్యను నిలదీస్తే
దండేసిన నీచిత్ర పటాన్ని చూపిస్తాడు !
నాన్ననడిగితే గుండెలదిరేలా రోదిస్తాడు !
మామయ్యలనడిగితే
వెక్కిళ్ళ నాపుకుంటూ
గుండెలకు హత్తుకుంటారు !
అత్తయ్యల నడిగితే
బావురుమంటూ తలలు నిమురుతారు
స్కూళ్ళు తెరచి మూన్నాళ్ళయినా
మురిపెంగా నీళ్ళోసి
ముచ్చటగా జడలేసి
వడివడిగా బడికి పంపే నీవు
గదులన్నీ గాలించినా
అగుపించకున్నావు !
మరెక్కడ దాక్కున్నావో ?
మాకళ్ళు చెమ్మగిల్లితేచాలు
అక్కున హత్తుకునే దానివి
ఆకళ్ళే నేడు కన్నీటి చెలిమలైనా
కళ్ళ ముందుకురాకున్నావు
మాకు ....... యింతటిశిక్ష వద్దమ్మా !
తట్టు కోలేకున్నాము, రామ్మా రా ... త్వరగా రా !

- రేణుక, రేఖ, మణికీర్తి (పల్లవి లేని చరణాలు)

మరణం :- 15-6-95

( విధివశాత్తు నూరేళ్ల నిండు జీవితాన్ని చేజేతులా 'బుగ్గి' పాల్జేసుకుని తన వాళ్ళందరికి ఎనలేని దుఃఖాన్ని మిగిల్చి దిగంతాలకు తరలి వెళ్ళిన, అల్పాయుష్కురాలు 'భారతి' కి అశ్రుతర్పణం !)

# స్మృతి తరంగాలు

"మదరాసు"కని బయలుదేరి
మరోదరికి చేరుకొని
మమ్మందరినీ శోక సముద్రంలో ముంచి
మౌనంగా వెళ్ళిపోయావా ? తమ్ముడూ!

అనంత కాల వాహినిలో
ఎన్నో సుడిగుండాల నధిగమించి
ఏబది రేవులు దాటిన నీ జీవన నావ
సుఖాల తీరం దరి దాపుల్లో
కృంగి పోయింది ఆకస్మిక తుఫానులో !

నీ అంతిమ దర్శనాని కొచ్చి
నిశ్చేష్టులై నిలిచిన నీవారల
నేత్రాంచలాల జారిన మౌన బాష్పాలతో
నిన్నభిషేకించి పూల తేరు పై
ద్రోణాచల పుర వీధుల్లో వూరేగించి
నాన్న, పెద్దనాన్నలు "నిదురించిన"
నిశ్శబ్ద సమాధుల మధ్య సంధ్యా దీపం వెలిగించి
బంధు మిత్రాదుల రోదనా సంరావముల మధ్య
తమస్విని ఒడిలో నిన్ను చేర్చి
తిరిగొచ్చిన నా నేత్ర ద్వయాల నుండి
ప్రవహిస్తోంది కన్నీటి స్రవంతి
స్మృతి తరంగాల ఘోషతో...!

జననం : 5-9-1944 మరణం :- 21-11-1995
"మదరాసు"కని బయలుదేరి మార్గ మధ్యములో జీపు ప్రమాదానికి లోనయి స్పృహకోల్పోయి మరెవ్వరికీ చెప్పకుండా తిరిగి రాని లోకాలకు తరలి పోయిన తమ్ముడు
ఆర్. రంగరత్నం గౌడ్ స్మృతికి అశ్రుతర్పణం !

# అశ్రుతర్పణం

ఏ పాఠశాలలోనూ
చదవలేకపోయినా !
ఏగురువునూ ఆశ్రయించి
విద్యనభ్యసించుకున్నా !
దాదాపు తొమ్మిది దశాబ్దాల వెనుక
మినుకుమినుకుమనే వీధిలాంతరు క్రింద
కనుపించని కవితామతల్లి
కమ్మని రూపమారాధించి
ఆమె స్వరూపాన్ని
అజ్ఞాతంగా, సమగ్రంగా చిత్రించి -
ఆ కమనీయ రూపాన్ని
దిద్దిన రూపాన్ని
కవితా లోకం అపురూపంగా
చూడక మునుపే......
ఆదివ్యమంగళ భారతి చరణాలు సేవింప
దివి కేగిన
చిత్ర కవితా ధురీణులు
సహజ కవిపుంగవులు
శ్రీరాప్తాటి ఓబిరెడ్డి
గారికిదే నా అశ్రుతర్పణం !

( ఓ.న.మా... లు తప్ప, వ్యాకరణాంశ విశేషాలు, కావ్యాల వూసెరుగని సామాన్య రైతు స్వయం కృషితోచదువుల మర్మమెరిగి, అనేక పద్య గ్రంధాలు రచించి, ఎన్నో చిత్రకవితలు సృష్టించిన సహజ కవి రాప్తాటి ఓబిరెడ్డి గారు తొంభై ఏళ్ళ వయసులో పరమపదించినపుడు).



# సంవేదన

ఒరే, కిష్టి !

అర్థ శతాబ్దిగా నిన్ను యిలాగే పిలుస్తున్నాను !

'చిన్నయ్యా' అంటు నీవు చిరునవ్వుతో

బదులు పలుకుతూనే వున్నావు !

ఆ పలుకులోని మాధుర్యం

ఏ గంధర్వ గాయకుని స్వరంలోనూ లేదు !

తొలి (తుది) సారిగా నీ నుండి

బదులు రాలేదని విస్తుపోయి చూస్తే-

యింకెక్కడున్నావు .....?

నీ వాళ్లందరిని వదిలి పెట్టి

అత్యంత ప్రియమైన నీ 'ప్యాపలి మండలాన్ని' వీడి
ఒంటరిగా చేరుకున్నావు సుదూర 'నక్షత్ర మండలం'!

నీ వెఱిగిన వారికే గాక
నిన్నెరిగిన వారికెల్లా, నేనున్నానంటూ-
వారి కష్టాల్లో, సుఖాల్లో పాలు పంచుకున్న ఓ అనురాగ మూర్తి,
అందుకో వేలాది శోకతప్త హృదయాల అశ్రుతర్పణం.

'రామాపురం' వంశానికే వన్నె తెచ్చిన
నీ వంటి సుపుత్రున్ని కన్నందుకు
మా అన్న! 'వెంకట్రామయ్య' ధన్యజీవి!
ఆ లోకం నుండే నిన్ను దీవిస్తున్నాడు !
వందేళ్ల కోసారి గాని జన్మించడు
నీ లాంటి 'వరపుత్రుడు' వంశానికి.!

నీ జ్ఞాపకాల నీలినీడల్లో
జీవన సంధ్యాకాలాన్ని యీడుస్తూ -
నా కళ్లలో నీకళ్ళుండే వరకూ -
నీ కోసం పరితపిస్తూ ....
పలవరిస్తూనే ఉంటా..... ఒంటరిగా......!

జననం : 19-12-45 మరణం :- 15-4-1999

(అన్న కుమారుడు నాకత్యంత ప్రీతిపాత్రుడు, ప్రజాభిమానం చూరగొన్న ఆర్.ఇ. కృష్ణమూర్తి గుండెపోటుతో మరణించిన సందర్భంలో..)

# శేషాచలవాసా.. (సప్తరాగమాలిక)

(హిందోళం)
శేషాచలవాసా !..... ఓ శ్రీనివాసా
నీగుడి గంటలు మ్రోగిస్తా
(సిందుభైరవి)
ఎన్ని గంటలైనా, నీవాకిటనే నిలుస్తా
గర్భగుడి వీడివస్తె నా
గుండె గోడు వినిపిస్తా.... ॥శేషాచలవాసా॥

(హంసా నందిని)
హిరణ్యాక్ష వరాలు నాకొద్దు
జీవన పర్యంతమూ, నీచల్లని
దీవెన నాకుంటే చాలు -

(కానడి)
పన్నీటి స్నానాలు నా కొద్దు
కన్నీటి మరకలు తుడిచే
కరుణాంతరంగం నాకుంటే చాలు - ॥శేషాచలవాసా॥

(సరస్వతి)
ఆమేసక ఒంటి సొంపులు నాకేల
ఇల్లాలి కంటి కాంతులు
కలకాలముంటే చాలు -

(కామవర్ధని)
స్వర్గ సుఖాలు నాకొద్దు
అనంతంలో కలిసే వరకూ -
అంతులేని మనశ్శాంతి నాకుంటే చాలు - ॥శేషాచలవాసా॥

(ధర్మవతి)
శోక సముద్రంలో మునిగి తేలే
యీ జనావళికి తరుణోపాయం
చూపించన...ఓ! సర్వాంతర్యామి... ॥శేషాచలవాసా॥

# పాడనా సాయి... పాడనా ! (యమన్ కల్యాణి)

పాడనా సాయి, పాడనా
షిరిడీలోని నీదు మహిమ
గళము విప్పి పాడుచుంటి
స్వరము మూగబోవు దాక ॥ పాడనా సాయి ॥

ద్వారకామయి నీనివాసము
సర్వజనులకు దర్శనీయం
శరణుకోరు భక్తులకు
నీవే కొంగు బంగారము

॥ పాడనా సాయి ॥

నే చేసిన దురితములు
కరగిపోని ధుని లోపల
కాగడజ్యోతి గైకొని నీవు
శుభములిమ్ము సాయి దేవ ॥ పాడనా సాయి ॥

# ఏ రీతి నిను కొలుతురా... (జయంతశ్రీ)

ఏరీతి నిను కొలుతురా
శ్రీశైల మల్లన్న
దారేది కనగాదురా ! ॥ ఏరీతి ॥

పాతాళ గంగతో
అభిషేకం చేద్దమన్న
శ్రీశైల సాగరంలో
నీరంత కలుషితమాయె ॥ ఏరీతి ॥

బ్రహ్మముహూర్తములోన
భక్తితో సేవిద్దమన్న
శబ్దకాలుష్యము తోటి
చిత్తమే శాంతి కోల్పోయెరా ॥ ఏరీతి ॥

ఇకరాదు యీ జన్మమళ్ళీ
బుద్ధి కుదిరి మనసునిల్పి
పంచాక్షరీ మంత్ర మెరిగి
లోలోన నిన్ను ధ్యానింతునురా ॥ ఏరీతి ॥

# అదిగో.. అల్లదిగో (మూడు)

అదిగో అల్లదిగో
మంత్రాలయ మదిగో
అవని లోన వెలసిన
పుణ్య క్షేత్రము ...... ॥ అదిగో ॥

పరిమళ కావ్యము
జగతి కందించిన
రాఘవేంద్రుడు వెలసినట్టి
క్షేత్ర రాజము ...... ॥ అదిగో ॥

మన్రో ప్రభువుకు
సంశయము తీర్చగా
బృందావనము, వెలికి వచ్చి
విస్మయపరచి
నిజరూపముతోటి
సాక్ష్యమ్ము లొసగి
భక్తావళి నలరించిన
దివ్య క్షేత్రమూ ...... ॥ అదిగో ॥

# నీదుసేవ చేయగోరి.. (గౌరీ మనోహరి)

నీదుసేవ చేయగోరి
చేరితి నే మంత్రాలయము || నీదుసేవ ||

తనివి తీర నిన్ను కొలుతు
నాదు కోర్కెలెల్ల నీవు
తీర్చుము స్వామీ... తీర్చుము స్వామి .... || నీదుసేవ ||

క్షేత్రము లెన్నో తిరిగినాను
మనసున కింత శాంతి లేదు
బృందావన దర్శనమున
తొలగి పోయె చింతలెల్ల
నీవెనాకు అండ స్వామి.... || నీదు సేవ ||

మనసు నిల్పి సేవచేయు
కుంటి గ్రుడ్డి వారి నెల్ల
బ్రోచునట్టి దైవమీవె
కలియుగాన వెలసినట్టి
కల్పతరువు నీవె గాద
గురు సార్వభౌమ.... || నీదు సేవ ||

# కదలివచ్చె.. కదలివచ్చె.. (అభేరి)

కదలి వచ్చె కదలి వచ్చె
రమణీయ స్వర్ణ రథం
తిలకించ రారండి
రాఘవేంద్రు వైభవం ॥ రండి రండి ॥

తుంగభద్ర జలము తోటి
అభిషేక మొసరించి
పరిమళ కుసుమాలతో
అలంకారములు సలుప
వేద మంత్ర ఘోషలోన
యతి రాజు రథము చేరె
కమనీయ దృశ్యము
కాంచగ రమణీయము ॥ రండి రండి ॥

గజరాజు ఘీంకరించి
గురు రాజు రథము లాగ
మంగళ వాద్యాలతో
గుడిచుట్టు విహరించు
మంత్రాలయాధీశుని
వరములంది శుభము పొంద
కదలి వచ్చె కదలి వచ్చె
రమనీయ స్వర్ణరథం ॥ రండి రండి ॥

# ఒక్కసారి వచ్చిచూడు.. (మాండ్)

ఒక్కసారి వచ్చి చూడు
మరువకు జీవా..
మంత్రాలయ దర్శనమె
మరిచిపోని అనుభవం ॥ ఒక్కసారి ॥

భూమి మీద స్వర్గమే
మంత్రాలయ క్షేత్రము
ఇహపరాలకు సేతువే
రాఘవేంద్రు నామము ॥ ఒక్కసారి ॥

తుంగభద్ర స్నానమే
పాపాలను తొలగించు
బృందావన దర్శనమున
తీరిపోవు కలత లెల్ల ॥ ఒక్కసారి ॥

శరణు కోరు భక్తులకు
గురుదయ ప్రసరించును
రాఘవేంద్రు సేవతోటి
వీడి పోవు బాధలెల్ల ॥ ఒక్కసారి ॥

# లేవోయీ, ఓ బాటసారి (కల్యాణ వసంత)

లేవోయీ ఓ బాటసారి
సాగించు నీదు యాత్ర
సాగి పొమ్ము నీతి పథంలో
మహాత్ముల బాటలో ॥ లేవోయి ॥

చేరుకున్నారు
ఎందరో గమ్యాన్ని
వీడకోయి నీ ధైర్యాన్ని
కలత చెందకు
కళ్లులేని కుళ్లుసంఘానికి ॥ లేవోయి ॥

వలదు ఆవేశం నీకు
వెర్రి మానవుల నిందలకు
మమత మరిచి
హృదయం విరిచి
రగిల్చిన గాయానికి..... ॥ లేవోయి ॥

వెనుకాడకు
నీకు తోడు లేరని
నీకెందు కోయి, నీతి మాలిన
సాటి మానవుని నీడ
భగవంతుడే నీకు తోడు - నీడ ॥ లేవోయి ॥

# పెళ్ళిచూపులయ్యాక....

( తంబి, తమిళ కవితకు స్వేచ్ఛానువాదం)



నా ఛాయ -
కాసింత నలుపని
' ఆ అబ్బాయి '
గొణిగాడట!

నా చదువు -
అంతంత మాత్రమేనని
' మామగారు '
పెదవి విరిచారట !

నా సొత్తులు -
ఏమంత నచ్చలేదని
'అత్తగారు'
మూతి తిప్పారట

నా మేని రంగుతో, చదువుల్తో
పై మీది ఆభరణాలతో
నన్ను తూచే
సగటు మనుషులకు -

నా ఆశలు.. ఆశయాలు,
రంగు రంగుల స్వప్నాలు......
ఎన్నో ?... ఇంకా ఎన్నెన్నో ?...

అన్నింటినీ మూటకట్టి
పుట్టింటిలోనే వదలిపెట్టి -
అలాంటివాళ్ళింట్లో అడుగు పెట్టేందుకు
నేను సిద్ధమయ్యానని.....
ఏ ఒక్కరికీ తట్టలేదు!

# కర్తవ్యం

ఓ,, సోదరీ, లే !
రా, కదలిరా !
నీ హక్కుల కోసం
శ్రమించు !
దిక్కులు పిక్కటిల్లేలా గర్జించు !
పిడికిలి బిగించి
ధైర్యంతో ముందుకు నడు!

మూఢాచారాలతో
సింగారించిమతసాంప్రదాయ
లేపనాలతో రంగరించి
వెలదీ!
నిన్ను ఆటబొమ్మగా మార్చే
కుళ్లు సమాజంపై తిరుగబడు !

నవనాగరికత అంటే
లేటెస్ట్ డ్రెస్సుల్లో
బ్యూటీ కాంపిటీషన్లలో
పాల్గొనడం కాదు !
పెదాలపై రంగుల పులిమి
ట్విస్ట్ డాన్సుల్లో
టైమ్ వేస్ట్ చేయడం
అంతకన్నా....... కాదు !

హృదయ కేదారంలో
చైతన్య సుమాలు పండించి
ఆదర్శపరిమళాలు జగతికంతా
వెదజల్లడం నీ కర్తవ్యం !

సహాగమన
దురాచారపు సర్పం
మళ్ళీ .......పడగ విప్పి
బుసలు కొడుతూ
దూసుకు వస్తోంది.
మరెందరినో కాటేయకముందే
పాటంగా మట్టు బెట్టు !

'సతి 'చావిళ్లలో
సేదతీర్చుకోవద్దు
పునాదులతో పెకలించు !
ఆత్మాహుతికి పాల్పడే
అభాగినులకు ఆధారం చూపించి
వారి జీవితాల్లో వెలుగు రేఖలు నింపు !
మన జాతి సంస్కారాన్ని నిలబెట్టు !
నీ ఎద ప్రమిదలో
మమతాను రాగాల
జ్యోతి వెలిగించి
సమతా కాంతులు
ప్రసరించు !

# సంస్మరణ - సంస్కరణ

నాటి నేతల త్యాగఫలం
నేటి తరం నోచుకున్న వరం
అదే నేటి స్వాతంత్ర్యదినం.

జాతి సర్వస్వం
సంబరం జరుపుకునే
ఏకైక పర్వదినం.

నాదేశం
సుసంపన్నం కాకున్నా
సుజలాలతో
సుఫలాలతో
అలరారు సుందరదేశం.!
సుజ్ఞానాన్ని
ప్రపంచానికి
పంచి పెట్టిన దేశం .
సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని
శాంతి సహనాల్ని
దిగంతాలకు
చాటి చెప్పిన దేశం.!

ఈనాటి సంబరాన్ని
అంబరాన్నుండి వీక్షించే
అకళంక దేశ భక్తుల
ఆవేదనా రవళి
జెండా రెపరెపల్లో కొట్టుకులాడి
నాహృదయకాసారంలో
కల్లోల తరంగాలు సృష్టించింది !

విచలితుడనై
విస్ఫారిత నేత్రాలతో
విశాల భారతాన్ని దర్శిస్తే -

గుక్కెడు గంజికి
"మానం " బజారున పరచి
హీనంగా బ్రతుకుతున్న
అభాగినుల తడియారని నేత్రాలు !

నాలుగు రోడ్ల కూడలిలో
నక నక లాడే కడుపుల్తో
అడుక్కుతినే
దౌర్భాగ్యుల నీరస నయనాలు

జాతర్లలో
బలిపీఠాలపై
తలలు వాల్చిన
మూగజీవుల కన్నీటి మరకలు !
నాకనుల ముందు కదలాడి
దృగంతాలు అశ్రుపూరితాలయ్యాయి !

ఈపవిత్ర ధరణిలో
గీతామృత ముదయించిన చోట
హాలాహలచెలిమలు నెగడుతున్నాయి !

గౌతమీ తీరంలో
ప్రణవ నాదం నీరసమై
ప్రణయగీతాల హోరు
జోరయింది !

వేదం వెలసిన చోట
పాదం మోపింది మతభూతం !

సమాజ దుస్థితికి చింతిస్తూ
చీకట్లో కూర్చున్న నాకు

"లే" శ్రమించు -
గమ్యం చేరే వరకూ
విశ్రమించకు -
అన్న వివేకానందుల
సందేశం స్ఫూర్తి నిచ్చింది !

"ఈసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగు పడునోయ్" అన్న
గురజాడ అడుగుజాడలు
నాకు కర్తవ్యాన్ని భోదించాయి !

గర్భగుడిలోని
చీకటి గదిలో
సర్వేశ్వరుణ్ణి
వెదకడం కన్నా -
"శ్రామకుడి స్వేద బిందువులో
కనుగొనడం మిన్న - అన్న
గీతాంజలి సందేశాన్ని గ్రహించాను!

బాల వితంతువుల
శోకతప్త కంటి కొనలకు
కాటుక రేఖలు దిద్దమన్న
కుందుకూరిని స్మరించాను.!

మన్యం ప్రజల్లో
చైతన్య జ్వాలలు రగిల్చి
స్వాతంత్ర్య సమరానికి
విప్లవ శంఖారావం పూరించిన
అల్లూరి ఆత్మ జ్యోతిని దర్శించాను !

దివిని చేరిన
ఆ తేజోమూర్తుల
సందేశ సుధలు
నాపై జాలు వారి
నన్ను సంప్రోక్షించాయి.!

★ ★ ★

ఆవేశంతో
అందుకున్నాను కలం....
గళం విప్పి
పాడుతున్నాను మానవతా గీతం -
నాగానం
దీపక్ రాగమై
మీ గుండె గుడుల్లో
వెలిగించాలి సమతాదీపం - !
ఆ వెలుగుల్లో, నాజనం
గుడి గోడలపై
ఖురాను లిఖించి
బైబిల్ పఠించినపుడే
నాదేశానికి నిజమైన స్వాతంత్ర్యం !

(కడప, విజయవాడ, హైదరాబాదు, విశాఖపట్టణం ఆకాశవాణి కేంద్రాలు, సంయుక్తంగా ఆగష్టు 15 నాడు, కాకినాడ సూర్యకళా మందిరంలో ఆహూతుల సమక్షంలో నిర్వహించిన కవి సమ్మేళనంలో చదివిన కవిత)

# దీపావళి



నా సీమలో
కరువు రక్కసి
విలయతాండవం
చేస్తున్న వేళ
నాజనం
ఆకలి కేకలతో
కన్నీటి దీపాలు
వెలిగించే వేళ
కరిగి పోతున్న
సంధ్యారాగంలో
నాసమాజపు తెరపై
అలుముకుంటున్న
నీలి నీడల జాడల
నాకలం కుంచెతో
ఆవిష్కరిస్తా !
నా ఎదనే ప్రమిదగా చేసి
మానవతా తైలంతో
కవితా జ్యోతిని వెలిగిస్తా !

x x x

ఆ కాంతి కిరణాల్లో -
కాలే కడుపుకు
గుక్కెడు నీళ్లతో
కడుపు నింపుకునే
అన్నార్తుల ఆరాటం !
ముసలి మగని
చితి మంటల్లో

కోర్కెలు సమసిన
బాల వితంతువుల
తడిసిన కనురెప్పలు !

కామాంధుల కౌగిట్లో
వన్నెలు తరిగిన
వారకాంతల కంటితడుపులు !

పాడుబడ్డ సత్రంలో
చీకట్లో గుక్క తిరగక
దగ్గుతున్న అనాథల
కంటికొస మెరపులు!

ప్రయాణికుల పెట్టెలో
పొట్ట కూటికి
పాద ధూళిని
దోసిళ్ళతో మోస్తున్న
అనాథ బాలుర
దీనపు చూపులు
మీ కనుసన్నల
నిలుపుతా !
ఆ విధివంచితుల
కొక్క బాష్పకణం
రాల్చితే -
మీ కరుణారస హృదయానికి
జోహార్లర్పిస్తా !

x x x

ఆనాడు
నరకాసురుడొకడే
నరహంతకుడు -

మరినేడో ....
ఫుట్ పాత్‌పై
ముడుచుకు పడుకున్న
పడుచు బిచ్చగత్తె
మానం దోచుకునే కీచకులు -

పసికందుల
పాలపౌడి డబ్బాల్లో
కల్తీ చేస్తూ
డబ్బుదోచేస్తున్న ధనపిశాచులు -

కల్తీ సారాతో
సరాసరి స్వర్గాన్నే
చూపిస్తున్న నరహంతకులు -

బంగారు వాకిళ్ల లోగిళ్లలో
ప్రసాదాలు కబళిస్తున్న
బకాసురులు -
వీరవిహారంచేస్తున్నారు !

నా జనం కళ్లుతెరచి
పిడికిలి బిగించి
పెనుగొండ హైనాలకన్నా
హీనంగా
కలికాసురులను
కూల్చిన నాడే
నాకు నిజమైన దీపావళి !

ఈ దీపావళి నాడు
మినుకు మినుకు మంటున్న
కార్తీక దీపాలు

తమస్సుని తలపైని
వజ్రాల కిరీటంలా
తళుకులు విరజిమ్ముతున్నాయి !
దిగంతాల దాగిన
దురాగతాలు దర్శనమిస్తున్నాయి !

స్వర్ణాలయ కుడ్యాలపై
పేరుకున్న మత మౌఢ్యపు
మరకలు తొలగించిన నేరానికి
నేలకొరిగిన 'శాంతిపావురం'
"నాదేశం ! నాదేశం ! - అంటూ
పలవరిస్తుంది!"....

అట్లాంటిక్ అలలపై
కూలిన 'కనిష్క'లోని
ఛిద్ర దేహాలు
క్షుద్ర మత రక్కసి
రక్తదంష్ట్రాలు గోచరిస్తున్నాయి!

శ్మశాన వాటికల్లో చోటు లేక
భోపాల్ వీధుల్లో
అగ్నిసంస్కారానికి
నోచుకోని కళేబరాలపై
'కథాకళి' సల్పుతున్న
భీకర మృత్యు విన్యాసం
గగుర్పాటు కలిగిస్తోంది!

గూళ్ళు వదలి
గొడ్లు విడిచి
నడి రాతిరి
బీడుపొలాల్లో పరుగిడి

రక్షణ శిబిరాల్లో
గువ్వలా ఒదిగేలా
నాసోదరులను
భీతావహులను చేసిన
కుల రక్కసి
జిహ్వాగ్ర జ్వాలలు
జలదరింపచేస్తున్నాయ్ !

ఎన్నాళ్ళ కాగుతుందీ
చరిత్ర గతి !
ఎన్నేళ్ళు సాగుతుందీ
గమ్యం లేని ప్రగతి !

ఈ దీపావళి
పర్వదినంనాడు
నేను కోరుకునేది
ఇంటింటి ముంగిటా
చమురు దీపాలు కాదు !
గుండె గుండెలో
వెలగాలి
అనురాగపు జ్యోతులు !
ఆనాడే నిజమైన దీపావళి !

అందాక
నాకళ్ళలో
కొవ్వొత్తులు పెట్టుకొని
నిరీక్షిస్తా !

(దీపావళి సందర్భంగా ఆకాశవాణి, విజయవాడ, విశాఖపట్నం, హైద్రాబాద్, కడప కేంద్రాల వారు సంయుక్తంగా కర్నూలు జిల్లా పరిషత్ హాలులో ఆహుతుల సమక్షంలో - 10 - 86 న నిర్వహించిన కవి సమ్మేళనంలో చదివిన కవిత)

# దైవత్వం - మానవత్వం

గుడిలోని మూల విరాట్టు మెడలో
మూడుమణుగుల పచ్చల హారం
ఎండవానల బండ బారిన శ్రామికుడి యింట్లో
మూడు పూటల తిండిలేని బ్రతుకుభారం

గుడిలోని రాతి బొమ్మకు
తడవ తడవకు నూతన వస్త్రాలంకరణ
గుడి బయట బిచ్చగత్తె
మానసంరక్షణకు మూరెడు బట్ట తిరస్కరణ

జగద్రక్షకుని ధర్మహుండీకి
పోలీసులే రక్ష దేవాలయంలో !
రక్షణ కోరిన ఆడదాని శీలానికి
'శ్రీరాముడే' రక్ష పోలీస్ స్టేషన్లో!

అమృతం తాగిన దేవునికి
ఆవునేతి లడ్డూల నైవేద్యాలు
అంబలికి నోచని అనాధల కడుపుల్లో
ఆకలి తిరుగలి వాయిద్యాలు

పురోగమిస్తున్న నవనాగరిక సమాజంలో
పునర్దర్శన మిస్తున్నాయి మూఢ నమ్మకాలు
అంతర్ధానమవుతున్నాయి దయాంతః కరణాలు !
అడుగంటి పోతున్నాయి మానవతా విలువలు !

# వినతి పత్రం

అన్నా తెన్నేటీ !
కొనుమన్నా కన్నీటి వీడ్కోలు
నీకిదే, మా తుది విన్నపం
సమర్పించు యీ నా వినతిపత్రం
దివిని చేరిన తేజో మూర్తులకు
స్వార్థమెరుగని దేశనాయకులకు

గురజాడతో చెప్పు
నీ అడుగుజాడల నడిచే
స్తోమత మాకింకా రాలేదని !

పొట్టి శ్రీరాములుతో
గట్టిగా చెప్పు
నీవుకన్న బంగారుకలలు
మట్టిపాలు చేశారని

వీరేశలింగంతో
ఆవేశంగా చెప్పు
మారని సంఘంలో
తడి ఆరని కళ్ళతో
చెదరినబొట్టు
సరిదిద్ద నీవు రావాలని
దీనురాండ్రు
నీరాకకు ఎదురు చూస్తున్నారని !

ప్రకాశం పంతులుతో
ప్రత్యక్షంగా చెప్పు
స్వార్థచింతన కంతులేదని
నాయకత్వం కరవయిందని
యువతరం నీరాకకై
ఎదురు చూస్తోందని !

నెహ్రూజీతో చెప్పు
నీవు నాటిన గులాబీ
మొక్కలు వాడిపోతున్నాయని
రెక్కలు రాలిపోతున్నాయని !

జయప్రకాశ్‌తో చెప్పు
దారిదోపిళ్ళు నీవు మాన్పిస్తే
నాయకులు నిలువుదోపిళ్ళు
చేస్తున్నారని !
బాపూజీతో
చివరి మాటగా చెప్పు
వన్నె తెచ్చు సుతులందరు
నీ చెంత చేరారని
భారతమాత విలపిస్తుందని
నీ వారసులతో
మళ్ళీ మామధ్యకు రావాలని
ఈ దేశానికి కమ్మిన
చీకట్లు పారద్రోలాలని
జాతికి పట్టిన గ్రహణం
విడిపించాలని
భారతావని ఆశతో
ఎదురు చూస్తోందని......

(ప్రజానాయకుడు, గాంధేయవాది, తెన్నేటి విశ్వనాథం గారు అసువులు బాసిన తరుణంలో..)



# ఉగాది

ఆకాశ వీధిలో
చైత్ర రథమెక్కి
వసంతాన్ని వెంటేసుకొని
కుముద్వతీ తీరాన
విడిది చేసిన ఓ ఉగాది
నీకు నేను స్వాగతం పలుకబోను !

ఓ బహుధాన్య . . . . !
అన్నపూర్ణ ఆంధ్రావనిలో
చారెడు చిరు ధాన్యం కరవై !
అన్నదాతలు ఆత్మహత్యలతో
మరో తీరం చేరుతుంటే
నీకెలా స్వాగతం పలుకేది !

నేల మీద బస్సులు
నీటి అడుగున వురకలు వేస్తూ
జనాల్ని నిదురలోనే
ఆవలి తీరం చేరుస్తుంటే
ఆత్మీయుల రోదనల్తో
నదీ తీరాలు ఘోషిస్తుంటే
నీ తీరానికి నన్నెలా రమ్మంటావు ?

'రేప్'ల రేసుల్లో
రికార్డులు సృష్టించి
అబలల శీలాల్ని
కటకటాల్లో దోచేస్తూ
'అధర్మో రక్షతి రక్షితః' అంటూ

రక్షక భటులు శృతిశోకాన్ని సవరిస్తుంటే
'లాకప్ డెత్'లలో
పై కప్పలు మౌన సాక్ష్యం చెబుతుంటే
పెదవైనా విప్పని నీవైపు
నేనెలా వచ్చేది ?

ప్రశ్నా పత్రాలు తస్కరించి
చీకటి బజార్లో విక్రయించి
విద్యార్థుల భవితవ్యాన్ని
అంధకారంలో పడవేసి
నల్ల డబ్బుతో దర్జాగా గడిపేస్తూ
చట్టం గొడుగులో
నికృష్టులు తలదాల్చు కుంటుంటే
సాగని నా అడుగులు
నీవైపెలా మళ్ళించను ?

కట్నం నేరమంటూ
వరకట్న పిశాచాన్ని తరమాలంటూ
వేదికల మీద వాగే ఫెమినిస్టులు
'ఫైవ్ స్టార్' హోటళ్ళల్లో
ఫారిన్ లిటర్న్ 'సన్ఇన్లా'ల కోసం
రేబాన్ గ్లాసుల్లో పరికిస్తూ
'కారిడార్ల'లో పచార్లు చేస్తుంటే
పిడికిలి బిగించిన నాకు
నీ అడుగుల సవ్వడితో నాకేంపని ?

పాదాలు పట్టో
పచ్చనోట్లు వెదజల్లో
దొంగ వేలిముద్రలు గుప్పించో

ఢిల్లీలో పాగా వేసి
త్రివర్ణ పతాకపు రెపరెపల్లో
నాయకమ్మణ్ములు
చెమటలు చల్లార్చు కుంటుంటే
కుతకుత లాడుచున్న నాకు
నీకు స్వాగతం పలికేందుకు
నా మనస్సు ఒప్పడం లేదు !

పదవుల కోసం
ఊసరవెల్లుల్లా
పార్టీలు మార్చేస్తూ
వెన్నుపోటే
విజయానికి తుది మెట్టంటూ
ప్రజానాయకులు
పార్లమెంటులో
సంబరాలు జరుపుకుంటుంటే
ఏ ముఖం పెట్టుకుని
నీకు స్వాగతం పలికేది ?

ఉప్పెనలొచ్చి
ఊర్లను కప్పేసి
చిరునామా చెరిపేస్తుంటే
మొలబంటి నీటిలో
మందభాగ్యులు
సాయంకై
వెర్రి ఆశతో
అర్రులు చాస్తుంటే
నీకెలా నా స్నేహ
హస్తం అందించేది !

జగతికి వసంతం తెస్తా
కోకిలమ్మకు కమ్మని పాటలు నేర్పుతా
గున్నమావి రెమ్మలకు
సొగసులు కూరుస్తానంటూ
నీవు గొంతు చించుకున్నా
నేను చలించను !

బ్రతుకు బాటలోని
గతుకుల్లో కూలిన
జీవన రథాన్ని యీడ్వలేక
ఏడుస్తున్న సగటు మనుషుల
జీవితాల్లో వెలుగు రేకలు నింపి
కన్నీటి మరకలు
తుడిచిన నాడే
నాకు నిజమైన ఉగాది
సరికొత్త ఆశలకు పునాది !

ఆనాడే నీకు
నిండు హృదయంతో
స్వాగతగీతం ఆలపిస్తా !

(బహుధాన్య ఉగాది సందర్భంగా 29-3-98 నాడు
కోవెలకుంట్ల కవి సమ్మేళనంలో చదివినది)

# మృత్యుమేఘం

కాదిది కవిత్వం
యదార్ధ సంఘటనలకిది దర్పణం !
నెచ్చెలి నును వెచ్చని
కౌగిలి విడివడి
శీతల మృత్యువు
బిగికౌగిట చిక్కుపడి
మృత్యు తరంగంపై
తలలు వాల్చిన
విధివంచితుల
కిది అశ్రుతర్పణం !

ఆరోజు
కడలి పొంగింది
కనురెప్పపాటులో
బందరును ముంచింది
మొలబంటి నీటిలో !

ఆవులించిన తుఫాను రక్కసి
కోస్తాతీరంపై విరుచుకు పడింది
నిబిడాంధకారంలో
మిన్నంటింది ఆర్తనాదం !

కరాళ మృత్యువు గజ్జెకట్టి
చరమ గీతం కర్కశంగా ఆలాపించింది !
ప్రళయ భేరి నినాదంతో
విలయతాండవం చేసింది.

'పంపా' నింపాదిగా
కొంపలు కూల్చేసింది !
'తాండవ' తరిమి తరిమి
'తుని'ని భీభత్సం చేసింది !
'నాగావళి' ఉరకలు వేసి

జనావళిని జలదిగ్బంధం చేసింది!
'వంశధార' చిందులు వేసి
చిరుగ్రామాల చిరునామాలు
చెరిపేసింది!

ఎటుచూసినా
కూలిపోయిన వంతెనలు
నేలనాలిన తరువులు
కొట్టుకు పోయిన ధాన్యరాసులు
చచ్చిన కోళ్ళ గుట్టలు
ఇసుక మేటలు పెట్టిన తోటలు
గాలి పటాలైన పేదలపాకలు !
ఆకలికేకలతో అలమటిస్తూ
నింగికి చాపిన రిక్తహస్తాలు!
తీరం అంతా అస్తవ్యస్త జనజీవితం
గతి తప్పిన జీవన దృశ్యం !

కోస్తాతీరం శోకంతో తపిస్తున్నా
అన్నపూర్ణ
అన్నమో! రామచంద్రా!
అని అలమటిస్తుంటే -
'సర్వేజనా స్సుఖినోభవంతు'
అంటూ శాంతిమంత్రంపఠిస్తే
ఆకలి మంటలు ఆరవు !
కన్నీటి మరకలు తొలగవు !

లే! పిడికలి బిగించు
తుఫాను తాకిడికి
వికృత రూపం దాల్చిన
ప్రకృతికి మరో కొత్త ఆకృతి కల్పించు!
కొట్టుకు పోతున్న
మానవత్వాన్ని గట్టుకు చేర్చు !

# నేత్రాలు వర్షిస్తున్నాయి

అన్న తమ్ముల అలుక
అతి దారుణంగా పరిణమించి
అతిపవిత్ర స్వర్ణదేవాలయములో
రుధిర స్రవంతులు ప్రవహింపజేస్తుందని
కలలోనైనా తలంచలేదు
పరమ పావని భారత జనని!

ముకుళిత హస్తాలతో
నిమీలిత నేత్రాలతో
దర్శించే భక్తులతో
అలరారు 'అకల్‌తక్త్'
పిడికిలి బిగియించి
రోషకషాయిత నేత్రాలతో
తిరుగాడు మత మౌఢ్యులకు
ఆలవాలమే అవుతుందని
క్షణమైనా ఊహించలేదు
పరమ పావని భరత జనని !

శతాబ్దాలుగా
"హర్ మందిర్ సాహిబ్" నుండి వెలువడే సంకీర్తనం
రణరంగ భేరీ నినాదాలతో
సంలీనమై పోతుందని
లిప్తకాలమైన అలోచింపలేదు
పరమ పావని భారత జనని !

నిత్యధూప నైవేద్యాలతో
పూజా ప్రసూనాలతో పరిమళిస్తూ
స్వర్ణకాంతులు దిగంతాల
విస్తరించే అమృతసర్ దేవాలయం

ఛిద్ర దేహాల వ్యాపృతమై
మృత్యు సుడిగాలులు
దశదిశలా కమ్ముకుంటాయని
కునికి పాటునకూడ
కలవర పడలేదు
పరమ పావని భారత జనని !

మాతృదేశ సరిహద్దుల్లో
శత్రువుల కోసం
అహరహం ఎక్కుపెట్టిన మరఫిరంగులు
వెనక్కు మళ్లి, నగరం నడి బొడ్డున
స్వైర విహారం చేస్తాయని
పొరపాటున నైన తలంచలేదు
పరమ పావని భారత జనని !

రత్నాలు పొదిగిన
రంజిత్‌సింగ్ హస్త భూషిత కరవాలం ఒదిగిన
"స్వర్ణపేటిక" "తోషాఖానా" లో
క్షిపణుల దాడికి బీటలు పడుతుందని
ఏమరుపాటునకూడా తలంచలేదు
పరమ పావని భారతజనని !

స్వర్ణకలశంపై దిక్కులు కలయ చూచే పతాకం
తూటాలకు కూలిన దేహాలు విరజిమ్మిన
కవోష్ణ రుధిర ధారల తడిసి
ధరిత్రి పై రక్తాశ్రువులు రాలుస్తుంది !!

ఉత్తుంగ హిమాలయ శిఖరాలపై
ఖిన్నురాలై కూర్చున్న 'భారతమాత' నేత్రాలు
నిర్విరామంగా వర్షిస్తున్నాయి.

# మానవత్వం మంట కలసినవేళ



సతి పేరిట
ఓ తన్వి దహిస్తుంటే
తరిస్తున్నామనుకున్న
జన సందోహం
ఏ పైశాచిక గణానికి వారసులో
ఏ శిలాయుగానికి ప్రతినిధులో !......

సజీవ దహనాన్ని కనులారా వీక్షిస్తూ
గుండెలు చీల్చే ఆక్రందనలను ఆశీస్సులుగా
"కాసెట్ల" పై ముద్రించి
సాయానికి ఆక్రోశిస్తూ
విరిసిన హస్తాన్ని
దీవెనలిచ్చే .....
అభయహస్తంగా తలంచిన జనాలు -
చితిమంటల వెలుగుల్లో
బొమికల పాచికలు విసరేసి
కనకపురాసులు కొల్లగొట్టే
నికృష్టగణాలు !

సాంప్రదాయం పేరుతో
నిండుప్రాణాన్ని నిలువునా కాల్చి
రాలిన బూడిద నుదుట బొట్టుపెట్టి
"చున్రీ" మహోత్సవం
జరుపుకున్న ఛాందసుల చేష్టలకు
నిశ్చేష్టురాలైన భారతమాత

రాజారామ్మోహన్‌రాయ్
కందుకూరి, బాపూజీలను
పదేపదే స్మరిస్తూ....
కన్నీరు కారుస్తుంది !

ఆ సతీ స్థలాలు
పుణ్యక్షేత్రాలు కావు!
మూఢాచారపు పెనుమంటల్లో
మాడిమసిబారిన కుందనపు బొమ్మల పై
నిర్మించిన చలువరాతి మందిరాలు !

సహగమన మారణహోమంలో
సమిధల్లారాలిన లావణ్యవతుల
సమాధుల మధ్య
ఘనీభవించిన నిశ్శబ్దాన్ని చీలుస్తూ
నీరవ నిశీథిలో నిత్యం వినిపించే
వేదనా రాగాలు
ఎడారి సుడిగాలుల్లో
కలసి పోతూనే వున్నాయి !

శతాబ్దాలు గడచినా
గ్రహాలపై గుడారాలు వేస్తున్నా
అజ్ఞానంతో నరమేధం సాగిస్తున్న
ఆధునిక సమాజం
విజ్ఞాన ప్రపంచాన్ని
వెక్కిరిస్తూనే వుంది !



# ఆత్మల పరితాపం

కాలం కడలిలో
తీరం చేరిన కెరటాలం !
ఆత్మీయుల శూన్యపు
ఎడారి గుండెల్లో
యింకి పోయిన
అనురాగ స్రవంతులం !

స్మృతుల ఒయాసిస్సుల్లో....
పొంగిన కన్నీటి వూటల
ఊగిస లాడే
కాడల్లేని నల్ల కలువలం !

అనంత విశ్వంలోనికి
విధి విసిరేసిన

బంధం తెగిన గాలిపటాలము !

అనంత కాలపు తెరపై
క్షణకాలం మెరసి
మాయమైన మెరపు తీగలం !

★ ★ ★

శతాబ్దాల నిశ్శబ్దపు
సమాధుల మధ్య
నిశీధి నెచ్చెలి కప్పిన
నీలికురుల పొరల్లో విచ్చిన
రుధిరారుణ సుమావృత
నిశ్వాస ధరిత్రిలో
భయవిహ్వల పవనం కట్టిన
బొమికల గూళ్లు మాకు నిలయాలు !

నిరాశా నిట్టూర్పులు
మా కావలిగట్టు !

మాచుట్టూ నిల్చిన
భస్మీరాసులు
మేము నిత్యం
వాడుకునే తలగడలు !

★ ★ ★

కాల పురుషుడు
దో(దా)చుకున్న
సిరిసిరి మూటలు !

మా తీరంలో పెరిగిన
మర్రి మాను
కన్నీటి జల్లుల తడిసి
జుట్టు విరబోసుకుని
చితి మంటల్లో
తల ఆర్చుకునేవేళ

షికారు కొచ్చిన నక్కల నాట్యాలు
కాపురాని కొచ్చిన గుడ్ల గూబల పాటలు
విందుకొచ్చిన రాబందుల రెక్కల దరువులు
క్షణప్రభా సహిత వజ్ర నిర్ఘోష యుక్త
ఘనాఘన గర్జితములు
మాకు వేడుకలుగా నిలిచాయి !

★ ★ ★

ఊడల మర్రి కొమ్మకొసల
వ్రేలాడే వాడిన పూదండల
తూగుటుయ్యాలలపై వ్రాలి
రేకులు రాలిన
స్వప్న కుసుమాలను
స్మృతుల సూత్రంతో కూరుస్తూ,
దిగంతాల పూసిన
రంగులు వెలిసిన
మమతల హరివిల్లు
అంచులు తాకాలనీ,
ఆ తీరంలో మరో దేహం
కోసం వెతకాలనీ
మా ఆరాటం !

# మధుర క్షణం

మరపురాదు ఈ దినం
మరువలేను ఈ క్షణం !

ఆంధ్రదేశపు అవధులు దాటి
అపార అంబుధి దాటి
అంబరవీథిని పయనించి
అనుంగు సోదరుల
కౌలాలంపూర్ సభలకలిసి
నూత్నకాంతుల తెనుగుతల్లి
విశ్వరూపం దర్శించి
మది పులకరించి
ఆనంద రసాబ్ధిలో
తలమున్కలైన
నా కేటికి వేరే స్వర్గం....
కన్నులారగాంచితి నిల
భూతల స్వర్గం !

శోభాసమన్విత నేటి
సభాప్రాంగణ దర్శనం
కోటి జన్మాల పుణ్య ఫలితం !

ముద్దులొలుకు
తేట తెలుగు
తేనె మాటల పలకరింపుల
పులకరింతకు
పొంగి పొరలె
ఆనందబాష్ప తరంగాలు !
వెల్లి విరిసె
విశ్వసభా ప్రాంగణ మెల్ల
సిరిమల్లె సౌరభాలు !

ప్రవాసాంధ్రుల
ప్రసన్నవదనాల విలసిల్లె
కోటి తటిల్లతా కాంతులు !
హృదయాల విరబూసె
సౌభ్రాత్ర స్నిగ్ధ సౌగంధికాలు !

తలపించె
నేటి మేటి కళాకారుల గోష్ఠి
నాటిభువనవిజయ ప్రాంగణ
రసమయ కవితాగోష్ఠి !
విశ్వసభావేదిక భాసిల్లె
తెలుగు వెలుగు జిలుగులు
విరాజిల్లె సంబరాల తోరణాల !
వర్ణింపతరమె నాదుకలానికి
మరే మధుర గాయకుని గళానికి !

ఈ లోగిలిలో
నా సోదరుల కౌగిలిలో
కరగిన క్షణం
జీవితాన తిరిగిరాని
మధుర క్షణం !
జీవనలతానికుంజం
సుమించిన అనుభూతి సుమం
హసించిన క్షణం !

(14-4-81 నుండి 18-4-81 వరకు కౌలాలంపూర్‌లో వైభవోపేతంగా జరిగిన ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా సమర్పించిన గేయమాలిక !)

# క్షామం కాలూనింది !

నీరదముల ఎదలెండి
దాహంతో మూర్ఛిల్లాయి
ఆకాశం అపసోపాలు పడుతుంది !

ధరిత్రి దాచుకున్న నీటినంతా
సహస్రాంశుడు వడివడిగా దోచుకోని
స్పృహ తప్పిన మేఘాలపై చిలకరించాడు

తెప్పరిల్లిన పయోధరాలు
పరుగులు తీశాయి
దుష్ట పవమానుని ధాటికి !

బిత్తరపోయిన భాస్కరుడు
అంతరిక్షంలో కాళ్లీడుస్తున్నాడు
ఎడారిలోని ఒంటరి బేహారిలా !

సెలయేటి కడుపున
కురంగాలు పరుగిడుతున్నాయి
తీరని దాహంతో
ఎండమావుల వెంట

ఎండిన చెరువుగట్ల మీది
కొంగల గుంపులు
వలస వెళ్తున్నాయి !

మండూకములు బొరియల్లో
మౌనజపం చేస్తున్నాయి
బొస బొసమనీ సర్పములు

మైదానముల తిరుగాడు చున్నవి
మయూరములు నాట్యం మరచి
భుజంగముల తరుముతున్నాయి !

మరాళములకై వీక్షించి
మానస సరోవరం కృంగిపోయింది !

కృషించిన జనత
పిడచ కోసం
నెత్తిన గంపలెత్తింది !

బక్క చిక్కిన బసవన్నలు
కబేళాలకు చేరుతున్నాయి !

కాలుని మహిషం
కాలు దువ్వి
కదం తొక్కుతుంది !

అయినా -
నా గుండె తడుస్తూనే వుంది
కన్నీటి వూటలతో
ఆర్ధ్రత ఆవిరిగాకుండా !

నా నయనాలు యింకా
వర్షిస్తూనే వున్నాయి
ఎండిన పొలాలు
చిగురుస్తాయేమోనని !

# నలిగిన గులాబీలు



ఓ నేస్తం !

వింటావా ఓ నిమిషం !
సంఘం చెక్కిన
శిథిల శిల్పాల
కన్నీటి గాథ !

ఈ వీధి మలుపులో
ఆ మురికి సందుల్లో
చీకటి గదుల్లో
కామాంధుల
కబంధ హస్తాలలో
బండబారిన
సుతిమెత్తని హృదయాల రోదన !
శ్రుతి తప్పిన జీవనరాగాలాపన !

మిత్రమా !
అలా చూడు ఓ క్షణం !
కామాంధుని బుసల్లో
బుగ్గియైన నునుబుగ్గలు

విటుని కౌగిట
కాలిపోయిన యౌవనం
ఇగిరిపోయిన సోయగం
సౌష్ఠవం కోల్పోయిన సౌందర్యం
కార్చిన కన్నీటి వెల్లువ !!

ఆ కన్నీటి తెరలచాటున
మరెన్నో...................
హృదయ విదారక దృశ్యాలు !

మల్లెలెన్ని తురిమినా
పరిమళం చిందని
కుళ్ళిన శరీరాలు !

చీకటి కంకితమైన
జీవచ్ఛవాలు !!
కామాగ్ని జ్వాలలకు
ఆహుతయిన శలభాలు !
చితికి చేరువవుతున్న
నికృష్ట శరీరాలు !
డబ్బుకు అమ్ముడు పోయిన
అంగడి బొమ్మలు !

ఎవరి దౌర్భాగ్యాలు ?
సంఘం వెలివేసిన
గమ్యం లేని బాటసారులు !
సూత్రమేలేని గాలిపటాలు !!
చమురులేని ప్రమిదలు !

చిత్రకారుని కుంచెలోని
ఆరిపోయిన రంగులు !!
ఏ నిమిషంలోనైనా
ప్రేలిపోయే గాలిబుడగలు !

మిత్రమా !
వినిపిస్తుందా ?
ఆశల సుడిగుండాలలో చిక్కుకొని
అంతులేని ఆవేదనలతో
అలమటించే
అభాగినుల ఆక్రందన !!

దాచుకునేందుకు
మరేమీ మిగల్చక
సర్వం దోచుకున్న
విలాసపురుషుని
వికటాట్టహాసం !

కనిపిస్తుందా ?
ఆ గాజు కళ్ళల్లోంచి
తొంగిచూచే

నిరాశా నిస్పృహల వెల్లువ !
ఎన్నో రాత్రుల విషాద
అనుభవాల క్రీనీడలు !!
ఉషోదయం లేని
విషాద జీవితచ్ఛాయలు !

తోడు లేక
నీడలేక
ఎండిపోయిన గుండెల
జీవన సమరపు ఛాయలు!!

కలలలో జీవిస్తూ
మమతానురాగాలకై
కలవరిస్తూ
కాలగర్భంలో
కలిసిపోయే
కాగితం పూలు !!
దేవుని పూజకు
నోచుకోని
నేలరాలిన పూలు !!

మానవ సమాజ గ్రంధంలోని
చివరి పుటల్లో సయితం
చోటులేని చరిత్రహీనుల
కన్నీటి బ్రతుకులపై
కించిత్తు సానుభూతి చూపలేవా ?
ఏకాంతంలోనైనా
ఓ వెచ్చని కన్నీటి బొట్టు
రాల్చలేవా నేస్తం !!

# సంక్రాంతి

పైరు పంటల నడుమ
పారాణి పదములతో
తరలి రావమ్మ
సంక్రాంతి లక్ష్మీ
హేమంత వీధి !

గంగిరెద్దుల వాని సన్నాయి మేళం
జంగం దేవర శంఖారావం
సాతాని జియ్యరు శ్రీహరి గీతం
నీకు తొలిజాము మేల్కొల్పు సంగీతం !

ముద్దబంతుల ముద్దిడిన
పైరగాలి సౌరభాలు,
చెంగు చెంగున దూకు
లేదూడల పాల నురుగులు,
నీకు స్వాగతం చెబుతున్నాయి.
పొలిమేరలో !
సిగ్గు మొగ్గలు తొడుగ
సిగ చేమంతులే తురిమి,
రంగు రంగుల రంగ వల్లికలు తీర్చి
మొగలి పూవంటి మగని కోరి
మురిపెముగా గొబ్బెమ్మలే పేర్చి
జడ కుచ్చుల చిఱు గంటల

చిరుగాజుల సరిగమల
ముద్దు గుమ్మలు నీకు
స్వాగతం చెబుతున్నారు
గుమ్మంలో !

భోగి మంటల అరుణిమ
నుదుటి సిందూరమై మెరయ
అభ్యంగ నావిష్కృత కురులు పైకెగయ
ముదమార ముడి వేసి
ముంజేతి గాజులు సయ్యాటలాడ
స్వాగతం చెబుతున్నారు నీకు
ముత్తయిదువలు
ముత్యాల ముంగిట !

నవ దంపతుల సరసాల
విరి బోణుల విలాసాల
బావ మరదళ్ళ పరిహాసాల
వదినా మరదుల అనురాగాల
చెంగలించు
మా సీమ కాదె
స్వర్గ సీమ !

సిందూరపు బొట్టు
పాపిట పెట్టి
దొండ పండంటి

కొడుకు నిమ్మని
కోరుకునే సీమంత వధువులు !

ప్రియుని పిలుపు
శతకోటి వీణలు మీట
ఎదలో ప్రణయ రాగాలు
సవరించు నవోఢలు !

వోర వాకిలి వెనుక
వాలు చూపులు సంధించు
వన్నెలాడుల క్రీగంట పరికించి
మధుర భావాల గుండె చప్పళ్ళ
పరవశించు కొత్త అల్లుళ్ళు !

మూసిన ప్రణయ
సౌధపు వాకిళ్ళు తెరచి
అలనాటి తొలిరేయి
వలపు కౌగిళ్ళు తలచి
పరవశించే మామలు !

అనురాగపు జల్లుల తడిసి
మగని పులకరింతకు జడిసి
లోలోన మురిసి పోయె అత్తలు !

కోడి పందాలు
కోడెల బలాలు

# సంస్కృతీ దర్పణం

ఏబది వసంతాల
స్వరాజ్యలక్ష్మీ
అద్దంలో తన ముఖబింబం
చూసుకొని
నివ్వెర పోయింది

"చంద్ర బింబం లాంటి
తన ముఖం వికృతంగా తయారయింది
బుగ్గల కందిన
మచ్చలు పలికించింది

గుడి కెళ్ళిన కన్నెపిల్ల
మానం దోచుకున్న
కామాంధుల క్రీనీడలు
గోచరించాయి

ఉబ్బుకొచ్చిన కనుగుడ్లలో
రైలు పెట్టెల్లో దోపిడీలు
కర్మాగారాల్లో కక్షలు
దోబూచు లాడాయి

తెగిన చెవి తమ్మెలలో
కమ్మల కాసించి
పసికందుల
గొంతులు నులిమిన
కిరాతకుల
గుండె చప్పళ్లు వినిపించాయి

చెదరిన లలాటికలో
మతోన్మాద హత్యల
బలియైన అమాయకుల
శోణిత మరకలు తొంగిచూశాయి

తొలగిన లలామంలో -
సతి ఎదుట పతిని వధించిన
కసాయి గుండెల ఘాతకం
వ్యంజిత మయింది

ఊడి పోయిన దంతాలలో -
కూలిపోయిన వంతెనలు
జారిపోయిన సిమెంటు పళ్ళిట్లు
తప్పిపోయిన చమురు ఫైళ్లు
చిగుళ్ల మెదలాయి

తలలో నెరిసిన వెంట్రుకలలో
రక్షక భటుల్లో
తొంగి చూస్తున్న
తిరుగుబాటు చర్యలు
స్మృతిలో మెదలాయి"

కెవ్వున కేకవేసి
అద్దాన్ని బద్దలు కొట్టింది
ఏం లాభం ?
ఆ అద్దం నిజమే చెబుతుంది !

నా నాటికీ
పతనమవుతున్న
భారతీయ సంస్కృతికది
నిజ దర్పణం !

# రావే...., నా చెలీ

రావే నాచెలీ
మురిపించవే
అనురాగవల్లరీ
సుహాసినీ, సుకేసినీ
సుమధుర భాసినీ
నా..హృదయ వాసినీ ॥రావేనాచెలీ॥

కనుపాపలలో నీరూపం
మనసున నిరతం నీధ్యానం
పెదవులనిలచెను నీనామం
నా మదిపాడెను జీవనరాగము ॥రావేనాచెలీ॥

ఆమనికోయిలపిలుపులే
ఎదలో రేపెను తలపులూ
మదిలో మోగెను వీణలు
వడిలో వాలవె మయూరిలా..... ॥రావేనాచెలీ॥

# అమర ప్రేమ

ఓ,......షాజహాన్ చక్రవర్తి !
నీవిశాల సామ్రాజ్యపు పునాదులు
సడలిపోతున్నాయని గ్రహించినా....
నీప్రేమైక హృదయం
కార్చిన కన్నీటి ముత్యం
అంతరించి పోకుండా కలకాలం నిలిచి పోవాలనే
నీవు ఆశించావు..!

వేదనాభరిత హృదయాలను ఓదార్చే సానుభూతి
కాలానికి లేదు !
నీరవ నిశీథిలో....
ఏకాంత మందిరంలో విశ్రమించిన నీచెవుల్లో....
మృత్యు సంగీతము
గుసగుసలాడింది!

నిరాకార శీతల మృత్యువుకు చెదరి పోని
రమణీయ రూపం సృష్టించి,
మరపురాని
మనోహర సౌందర్యాన్ని..
తరతరాలవారికి
నీవు అందించావు.

కాలచక్ర భ్రమణంలో
శతాబ్దాలు దొర్లిపోయాయి!
నీ అనురాగపు హృదయానికి
సాక్షీభూతాలైన తారకలు -
నీ అమరప్రేమను నేటికీ
జ్ఞాపకం చేసుకుంటూ..
నిట్టూర్పులు విడుస్తున్నాయి
వినీల గగనంలో.....!

(విశ్వకవి రవీంద్రుని " ఎ టియర్ డ్రాప్ ఆఫ్ లవ్" అను గేయానికి స్వేచ్ఛానువాదం)

# త్వమేవాహమ్

నాజీవితాన నీవె ఒక
ఆమనిపై వచ్చావు ॥నాజీవితాన॥

నాహృదయంలోన నీవె..
కలకాలముండి పోవ ॥నాజీవితాన॥

నా అంతరంగమందు
నిను నిలుపుకొంటి నేను
నాచేయి పట్టినీవు
పలుబాసలెన్నో చేశావు
మారిపోవు లోకం
మరిమారబోకు నేస్తం ॥ నాజీవితాన॥

నాహృదయమందిరాన నిను
కొలుచుకొందునేను
నా హృదయవీణనీవే
శ్రుతిచేసి పాడుకోవ ॥నాజీవితాన॥

నా నోముఫలము నీవె
నే కోరనింక వేరే
నయనాల నిలిచినావు
ఎన్నెన్నోకలలుకన్నాను
అనురాగభరితహృదయం
అర్పించినాను నీకె
నీ రాకకోసమే నేను
వేచియుంటినిన్నాళ్ళు... ॥నాజీవితాన॥



# రాధా మాధవీయం

సాయం సమయం. యమునా తీరం
రాధ వేచేనురా, మాధవా రావేలరా ॥సాయం॥

తీయని తలపులు, మదిలో మెదిలెను
వెచ్చని కోరిక ఎదలో రగిలెను
తనువు పులకించెరా
మనసు మురిపించవా
వేగ రావేలరా మాధవ
చెలినేల రావేలరా ॥సాయం॥

ఆమని కోయిల ఆలపించగా
తీయని వేణువు వినిపించెరా
విరిసిన వెన్నెల వీడకముందే
సిగలో మల్లెలు వాడకముందే
సందిట చేర్చరా
ఆమని అందాలు - చవిచూపరా ॥సాయం॥



# వెలుగు నీడల... (సింధుభైరవి)

వెలుగు నీడల వింత లోకంరా
అన్నా, అంతుతెలియని లోతులున్నవిరా.......
పుణ్యక్షేత్రము లెన్నితిరిగినా
నదుల నెన్నిట మునకలేసినా
భక్తిభావము మదిని నిలుపక
ముక్తిమార్గము దొరక బోదన్నా . ॥ వెలుగు నీడల ॥

వింతలోకపు సంతలోన
కుప్పిగంతులు ఎంత కాలం
కళ్ల గంతలు విప్పిజూడు
వలస వెళ్లేరోజులొచ్చె ॥ వెలుగు నీడల ॥

పట్టుబట్టిచుట్టుకున్న
పాముతట్టిగురిని బెట్టి
భృకుటి మధ్యన వెలుగుజ్యోతిని
ఎరుకతోటి కాంచుమన్న
అన్నా! ముక్తి కాంతను పొందుమన్నా... ॥ వెలుగు నీడల ॥

## శాశ్వతమా... (కీరవాణి)

శాశ్వతమా.... యీదేహం..
త్వరపడవే.......ఓమనసా !

జీవనరంగాన నీదో వేషం
ఆడే వరకే నీదాపాత్ర
ఏనిమిషాన ఆటముగియునో
ఆడించే, ఆదేవునికెరుక || శాశ్వతమా ||

దేహము స్థిరముగ నిలువదు సుమ్మీ
రూపము చెదరకపోనదు మళ్లీ
యీ మహిలోని మాయలో పడిపడి
గమ్యంగానక తిలగేనెందుకు || శాశ్వతమా ||

ఇహలోకములో సుఖములు మరిగి
కోర్కెలవెంట పరుగిడకోయి
ఏదోనాటికి కాటికి చేరును
నిలుచుటకల్ల మలినశరీరము
ఊరింపకే ఓ మనసా
యీదేహము పై వ్యామోహం...! || శాశ్వతమా ||

## ఒంటరిగా... (శంకరాభరణము)

ఒంటరిగా
నిజము నీవు తెలుసుకో
ఈజీవితమూ
క్షణికమని మరువకూ ॥ఒంటరిగా॥

కామక్రోధ లోభములకు
లొంగి పోవకూ
క్షణికమైన సుఖములకై పరుగులెందుకూ
మానవసేవే గదా మాధవసేవా
యీ నిజమూ నీవు
మరువకు ఎన్నడూ ॥ఒంటరిగా॥

కలిమి బలిమి వున్ననాడు
మిడిసిపడుకుమా
మూడునాళ్ల బ్రతుకుపైని
మోజు లెందుకూ
దారాసుతు లెవ్వరూ వెంటరారురా
నీ దానం ధర్మం
తోడుగ నిలుచురా ॥ఒంటరిగా॥

# ఏమిజన్మ... (అభేరి)

ఏమిజన్మమేమిబ్రతుకు
మూడునాళ్లసంబరం
మోహమేల జగతిపైన
ఇలను సుఖము లేదుర.. ||ఏమిజన్మ ||

గూటిలోని రామచిలుక
ఎగిరిపోవు నొకనాటికి
చిలుక లేని పంజరమును
తాకరెవ్వరూ.....తాకరెవ్వరూ. ||ఏమిజన్మ ||

తిరిగి రాని పయన మెటకో
తెలిసినోళ్ళు ఎవ్వరూ?
రాకపోకల మర్మమరయ
జన్మచాలదూ......జన్మచాలదు. ||ఏమిజన్మ ||

వేదశాస్త్రములు చదివినవారె
ఎరుగనేరరు సృష్టివిలాసరీ
సంశయాలతో సతమతమవక
శరణు వేడరా సద్గురుమూర్తిని . ||ఏమిజన్మ ||

# మాయా జగతిరా... (హిందోళం)

మనసా.. వెర్రిమనసా
మాయాజగతిర- మారాము సేయకు
అంతరంగమున -అలికిడి వినరా.. ॥ మాయా ॥

నేనను మత్తును వీడుమురా
లోపలి వెలుగు కనుగొనరా
వెతికే దెందుకు నలుదిశల
వెతికేదున్నది నీలోనే.. ॥ మాయా ॥

దేనికోసమో, వచ్చావిటకు
వచ్చిన పిమ్మట మరచేవూ
గుర్తుకు రాక వెదకుచుంటివి
దొరికే వరకు ఆగదు పయనం ॥ మాయా ॥

జీవన సంద్రములోన
ఎగిసే మమతల తరగలు
కరగక మానవు తీరంలో
ఈ అనంతకాల పయనంలో
ఎవరికి వారే యమునాతీరే ॥ మాయా ॥

# క్షణికమైన... (మాయామాళవ)

క్షణికమైన బ్రతుకుపైన
మరులు ఎందుకు జీనా..
జీవితాన..శాంతిలేక
పరుగు లేలరా.. ॥ క్షణికమైన ॥

కామక్రోధలోభమోహా
మత్తులోన మునిగితేలి
దారితెన్ను గానలేక
కృంగిపోదు వేలరా..... ॥ క్షణికమైన ॥

లేనిపోని ఆశలెల్ల
పెంచుకోకు జీవితాన
పొంగిపోకు తీరువేళ
కుమిలిపోకు తీరకున్న ॥ క్షణికమైన ॥

భ్రమలుకొలుపు మాయకాయం
నిలువబోదు ఆట్టెకాలము
నాది నాదనె భ్రాంతి వీడి
ఆదిమూలం తెలుసుకోర ॥ క్షణికమైన ॥

విలాసపు హోటళ్ల
విశ్రాంతి గదుల్లో
పాపపుకొవ్వొత్తులు
వెలిగించే యువతరం
చీకట్లు కమ్మిన
సమాజసౌధంలో
ఆదర్శజ్యోతులు
వెలిగించేవరకు
నాకలం
పయనిస్తూనే వుంటుంది!



## BIO-DATA OF R. RANGASWAMY GOUD

| | | |
|---|---|---|
| NAME | : | R. RANGASWAMY GOUD |
| DATE & PLACE OF BIRTH | : | 18-7-1941, Dhone |
| DISTRICT & STATE | : | Kurnool, A.P. |
| QUALIFICATION | : | B.E., M.I.E., M.I.G.S. |
| PRESENT ADDRESS | : | Superintending Engineer, P.J.P. Circle No. 1, GADWAL - 509 125 |
| MOTHER TONGUE | : | Telugu |
| BOOKS PUBLISHED | : | *Vedana Tarangam* (Free Verse)<br>*Malaysia Madhura Smruthulu* (Travelogue)<br>*Gundeloni Naadalu* (Free Verse)<br>*Manoragam* (Free Verse) |

**AUDIO**

| | | |
|---|---|---|
| 1. *Bhakti Tarangalu* (Devotional Songs) | : | Audio cassette (10 lyrics) |
| 2. *Mukti Mandaralu* (Tatwalu) | : | Audio cassette (8 lyrics) |

| | | |
|---|---|---|
| RELATIONSHIP WITH SAHITI & SANSKRITIKA MANDALS | : | Founder President, Yuvajana Sahiti Samakhya, Jammalamadugu, Kurnool<br>Executive Committee Member, Cuddapah Dist., Writers Association<br>Executive Committee Member, Anantapur Dist. Writers Association<br>Executive Committee Member, Samskruti Samakya, Vijayawada<br>Member, Authors Guild of India, New Delhi<br>Member, A.P. Sahitya Academy, Hyderabad<br>Vice-president, Samskruthi Samakya, Kakinada.<br>Member, Srilekha Sahiti, Warangal |

**PARTICIPATION IN KAVI SAMMELANAMS** : Participated in Second World Telugu Mahasabhalu held at koulalampur (Malaysia) in 1981.

Sweeyea Kavitha Patnam in All India Radio, Cuddapah for about 30 times.

Participation in State Poet's "Kavisammelanam" at Tirupati, Kakinada and Kurnool organised jointly by All India Radio Station, A.P.

Participated on important occasions organised by noted Sahitya Samithis in A.P. (Vizag, Ananthapur, Cuddapah, Guntakal, Gooty, Kakinada, Jammalamadugu, Koilakuntla, Proddutur, Muddanur, Ponnur and Vijayawada etc.,)

**HONOURING OF POETS**

1. Mahakavi Sri Gadiaram Venkata Sesha Sastry : Jammalamadugu
2. Famous Cine Writer Junior Samudrala : Jammalamadugu
3. Satavadhani Sri C.V. Subbanna : Jammalamadugu
4. Sri J. Bapu Reddy I.A.S. : Jammalamadugu
5. Nanduri Krishnamacharyulu : Anantapur

*** Many Writers & Poets every month at Jammalamadugu (1978-80).

**FELICITATIONS**

Irrigation, Revenue & Police Departments : Jammalamadugu

Samskruti Samakhya, Cuddapah : Muddanur

Dist. Collector, Anantapur : Anantapur

Pragati Kala Niketan : Jammalamadugu